Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం I.] మద్రాసు : 1941 వ సం॥ జూన్ నెల 20 వ తేదీ శుక్రవారం [నె 14 రు

## ఈ వారంలో యుద్ధ వార్తలు:

### విమాన దాడులు.

11 వ తేదీ బుధవారం రాత్రి, బ్రిటిషు విమానములు జర్మనీలోని రూరు ప్రాంతమునందలి డుస్సెల్డార్ఫు మొదలగు పారిశ్రామిక పట్నాలమీద బహు తీవ్రమైన దాడి సాగించినవి. చాల ఫాక్టరీల నుండి ఆకాశమెత్తున అగ్నిజ్వాలలు లేచెను. ఈ దాడులనుండి 8 విమానములు తిరిగిరాలేదు. గురువారము ఉదయమున, మధ్యాహ్నము ఇంగ్లీషు చానలునందు శత్రు నౌకలమీద, కెలె మొదలగు ఫ్రెంచిరేవు పట్టణములమీద బ్రిటిషు విమానములు దాడిసాగించెను. 1,400 టన్నుల శత్రు నౌక యొకటి ముంచివేయబడెను. ఫరాసు కోస్తా రేవులపై పడిన బ్రిటిషు బాంబుల ప్రేలుడుకు బ్రిటిషు కోస్తాయందలి భవనములుగూడ కదలిపోయెను. గురువారము రాత్రి మరల వందలకొలది విమానములు రూరు ప్రాంతముపై దాడి సాగించి, అనేక పట్టణములపై అగ్నివర్షము కురిపించెను. బ్రిటిషు విమానదళమింత బ్రహ్మాండమగు దాడిని ఇదివరకెన్నడును జరిపియుండలేదు. చాలఫాక్టరీలు ధ్వంసమొనర్పబడెను. ఆరు విమానము లీదాడి నుండి తిరిగి రాలేదు. ఆ రాత్రి బ్రిటిషు కోస్తా విమానములు, బ్రెస్టు, ఆంట్వెర్పు, రాటర్డాము మొదలగు శత్రురేవులపైన గూడ వందలకొలది బాంబుల వర్షించి ధ్వంస మొనర్చెను. శుక్రవారము రాత్రి బలమగు బ్రిటిషు విమానదళము, గ్నిసో, షెరక్ పోర్టు, మరియొక 26 వేల టన్నుల క్రూజరు నిలచియున్న బ్రెస్టు రేవుపైకి దాడి వెడలి, ఆ నౌకలపై వందలకొలది బాంబులవర్షించెను. ఆ నౌకలకు చాల బాంబు దెబ్బలు తగిలెను. వీనితోబాటు రూరు ప్రాంతముపైనగూడ వందలకొలది విమానములు మరల దాడి జరిపెను. శనివారము తెల్లవారు జామున బ్రిటిషు విమానములు బులోన్, కెలె అను ఫ్రెంచి రేవులపైకివెళ్లి బాంబులు వర్షించినపుడు రేవు నుండి బ్రహ్మాండమగు ప్రేలుడు శబ్దములు వినిపించెను. ఫ్రాన్సు ఉత్తరభాగమున గూడ చాల ప్రదేశములలో బాంబులు వేయబడెను. ఆదివారము రాత్రి రూరుప్రాంతము పైననే గాక బులోన్, డంకర్కు మొదలగు ఫ్రెంచి రేవులపైనగూడ పెద్దదాడులు జరుపబడెను. 600 టన్నుల శత్రు స్టీమరు నౌక యొకటి ముంచివేయబడెను.

సోమవారము రాత్రి బ్రిటిషు విమానములు తిరిగి రూరు ప్రాంతముపైకి వెళ్లి కొలోను, డుస్సెల్డార్ఫు మొదలగు పట్నాలను అగ్నివర్షమునకు గురిచేసెను. 17 వ తేదిన బ్రిటిషు విమానములు ఇంగ్లీషు చానలుపైనను, ఫ్రెంచి కోస్తారేవులపైనను బహుతీవ్రమగు దాడుల జరిపెను. అచట జర్మను విమానములకు బ్రిటిషు విమానములకు పెద్ద యుద్ధం జరిగెను. అందు 13 శత్రు విమానములు కూల్చివేయబడెను. 10 బ్రిటిషు విమానములు తిరిగి రాలేదు.

బ్రిటిషు ప్రభుత్వమువారు, శత్రు విమానములను కనుగొని వానిని సరిగ గురిపెట్టి కాల్చగల అద్భుతమగు క్రొత్త రహస్య ఆయుధమును కనిపెట్టిరనియు, రాత్రి దాడుల నివారించుటకిది చాల బాగుగ పనిచేయుననియు, బ్రిటిషు పార్లమెంటులో బీవరు బ్రూకు ప్రభువు 18 వ తేదిన ప్రకటించిరి. ఈ ఆయుధము రేడియో యంత్రముల సహాయముతో సమకూర్పబడెను.

11 వ తేదీ రాత్రి జర్మను విమానదళం, బ్రిటనులో తూర్పు, దక్షిణ, పశ్చిమ ప్రాంతములందలి అనేక పట్నములపై బాంబులు వర్షించినది. కాని ఆ బాంబులలో చాలభాగం, ఇదివరకటి దాడులలోనే శిథిలమైపోయిన భవనములపై పడుటచే యెక్కువ జననష్టంగాని ఆస్తి నష్టంగానికలుగలేదు. లండనుపైన శత్రు విమానాలు చాలసేపు విహరించెనుగాని బాంబులవేయలేదు. గురువారము రాత్రి చాల స్వల్పమగు దాడులు మాత్రమే జరిగెను. శుక్రవారం రాత్రి విస్తారముగ పలుతావులలో దాడులు జరిగెను, కాని ఎక్కడనూ విశేష నష్టంకలుగలేదు. శనివారము పగలు బ్రిటనుపై ఎక్కడను విమానదాడులే జరుగలేదు. శత్రు విమానములు బాంబులతోబాటు, కొన్ని కరపత్రములగూడ వెదజల్లెను. ఆదివారముదయము బ్రిటను ఆగ్నేయ భాగమున కొన్ని ప్రదేశములలో అక్కడక్కడ బాంబులు పడెను. రాత్రిగూడ ఒక మూలనున్న పట్టణమున మాత్రమే కొన్ని బాంబులు పడుట తప్ప దేశమందెక్కడనుగూడ శత్రు దాడుల భయములేదు. 16 వ తేదీ సోమవారము ఉదయము లండనుపైకి కొలది విమానములు వచ్చిపోయెనుగాని యెక్కువ బాంబులు వేయలేదు. ఆనాడు 11 శత్రు విమానములు పడగొట్టబడెను. మంగళవారం పగలు దాడులేలేవు. రాత్రి మాత్రం అక్కడక్కడ స్వల్పముగ బాంబులుపడెను. బుధవారము పగలు మాత్రముకొన్ని చోట్ల పెద్ద బాంబులు పడెను.

మే నెలయందు శత్రు విమాన దాడులవలన ఆంగ్లదేశమున 5,394 మంది మరణించిరి. 5,181 మంది గాయపడిరి. ఏప్రిలు నెలలో కంటె ఇది 2,000 తక్కువ.

### ఆఫ్రికా, మధ్యధరా ప్రాంతములు.

ఉత్తరాఫ్రికా లిబియాలో టొబ్రూకు రేవు దుర్గంపైన శత్రు విమానములు 12 వ తేదిన దాడి జరిపెను. కాని యెక్కువ నష్టము కలుగలేదు. లిబియా సరిహద్దులలో సోలం ప్రాంతమున శత్రుసైనిక పంక్తులపైన బ్రిటిషు సైన్యములు పెద్ద దాడిని సాగించినవి. బ్రిటిషు సైన్యములు కొంతముందునకు సాగిపోగల్గినవి. ఉభయ పక్షములును చాల సైన్యమును పోరాటమునందుపయోగించుచున్నారు. బ్రిటిషు సైన్యము లీ పోరాటమున 17 వ తేదిన సోలము దాటి లిబియా సరిహద్దులగల కోపుజా రేవువరకును శత్రు సైనికపంక్తులను భేదించుకొని పోగల్గినవి. 18 వ తేదీన భయంకరమగు పోరాటము జరిగెను. శత్రులకు అపారమగు నష్టం కలిగించబడింది. శత్రులు వెనుకగా వచ్చి పట్టుకొన చూచుటచే బ్రిటిషు సైన్యములు తిరిగి వెనుకకు రావలసివచ్చినది.

11 వ తేదీ బుధవారము ఉదయము, ఎరిత్రియాలో ఎర్ర సముద్ర ప్రాంతమున ఇటాలియనుల కింకను మిగిలియున్న అస్సాబ్ రేవును బ్రిటిషు నౌకా విమాన సైన్యము లాక్కుమారుగ ముట్టడించి ఆక్రమించెను. ఇచ్చట 39 జర్మను నావికులు 50 ఇటాలియను నావికులు 80 వైమానికులు ఇటాలియనుల వర్దా సేనాని, పిసెంటినీ సేనాని, కొన్ని వందల సైన్యముతో ఖైదీలుగా చిక్కిరి. అబిసీనియాలో, దేశీయ సైన్యములు అడ్డిస్ అబాబాకు 170 మైళ్లు పడమటగానున్న నెకెంటీ దుర్గమును ఆక్రమించెను. జిమ్మా ప్రాంతమున కొన్ని వైపులనుండి బ్రిటిషు సైన్యములును, మరికొన్ని వైపుల బెల్జియం సైన్యములు వచ్చిచుట్టుముట్టుచున్నవి. 15 వ తేదీన టానా సరస్సు ప్రాంతమున జరుగుచున్న పోరాటములో, ఇటాలియనుల పెలోరోస్సో సేనాని 2,000 సైనికులతో బ్రిటిషు సైన్యమునకు లొంగిపోయెను. జిమ్మా ప్రాంతమున అబిసీనియా సైనికులు మక్కరావద్దనున్న ఇటాలియను విమానాశ్రయమును ఆక్రమించిరి.

12 వ తేదిన శత్రు విమానములు మాల్టా దీవిపైనను రేవుపైనను తీవ్రమగు దాడి సాగించెను. 10 శత్రు విమానములు పడగొట్టబడెను.

13 వ తేదిన బ్రిటిషు విమానములు మధ్యధరా సముద్రమున, యుద్ధ నౌకల రక్షణతో ప్రయాణమొనర్చుచున్న శత్రు సప్లయి నౌకల జట్టును యెదిర్చి ఒక 7,000 టన్నుల నౌకను ముంచివేసెను. బెన్ఘాజీ రేవుపైన మరల దాడి సాగించి రేవులోనున్న నౌకలపై చాల బాంబుల వర్షించెను. డెర్నా రేవుపైన అయిదు సారులు విమానదాడులు జరుపబడెను. జూన్ 14, 15 వ తేదీలలో లిబియా తీరపు ప్రదేశములమీద విస్తారమగు దాడులు జరుపబడెను. సైప్రెస్ దీవిపైనను, జిబ్రాల్టరుపైనను గూడ 13 వ తేదిన శత్రు విమాన దాడులు జరిగెను గాని ఎక్కువ నష్టము గలుగలేదు.

సిరియాపై బ్రిటిషు దాడి చురుకుగా సాగుచున్నది. కోస్తా ప్రాంతముమీదుగ, పాలస్తానమునుండి ప్రవేశించిన సైనిక దళం, 12 వ తేదిన, సిరియా రేవులలో నొకటియగు సిడానును ఆక్రమించెను. బెరూటు రేవు ప్రాంతముపై విమాన దాడులు జరుగునని ముందుగా హెచ్చరించి 14 వ తేదిన బ్రిటిషు విమానము లాప్రాంతపై దాడులు సాగించి వేలకొలది బాంబుల వర్షించెను. బ్రిటిషు సైన్యములు 18 వ తేదికి బెరూటునకు 12 మైళ్ల సమీపమునకు చేరినవి.

దక్షిణమునుండి సిరియాలో ప్రవేశించిన మరియొక దళము, మెర్జి అయూం అను పట్టణము 12 వ తేది నాక్రమించెను. సిరియా రాజధానియగు డమాస్కస్ నగరమును అన్నివైపులనుండియు బ్రిటిషు సైన్యములు చుట్టుముట్టినవి. డమాస్కస్కు 15 మైళ్లు దక్షిణంలోనున్న కిస్వేదుర్గమును 14 వ తేదిన బ్రిటిషు సైన్యము లాక్రమించెను. 15 వ తేదిన డమాస్కస్ పరిసరములలోనున్న సాల్టా అను దుర్గము ఆక్రమింపబడెను.

మెర్జి అయూం ప్రాంతమునను ఇతర రంగములలోను గూడ ఫ్రెంచి సైన్యములు తీవ్రమగు దాడుల జరిపి బ్రిటిషు సైనిక పంక్తులను ప్రవేశించుచున్నవి. అయినను బ్రిటిషు పురోగమనము సంతృప్తికరముగనే సాగుచున్నది.

ఇరాకునుండి తూర్పు వైపుగా ప్రవేశించిన బ్రిటిషు సైన్యములు 'డెర్ ఎజ్ జర్' అను విమానాశ్రయమును ఆక్రమించెను.

స్మర్నాయందలి పరాసు కాన్సలు స్వతంత్ర ఫ్రెంచి వర్గమున చేరెను. చాల ప్రదేశములలో ఫ్రెంచి సైనికులు, విషీనాయకత్వమును వదలి బ్రిటిషువారి వైపునకు వచ్చిచేరుచున్నారు.

సిరియాయందలి జర్మనులు, ఇటాలియనులు, దేశమును ఖాళీచేసి, టర్కీమీదుగా వెళ్లిపోవుచున్నారు. పాలస్థానమునందలి హైఫా, టెలీఅవీవు రేవులపై శత్రు విమానములు 14 వ తేదిన పెద్ద దాడులనే సాగించెను, కాని యెక్కువ నష్టము కలుగలేదు.

## విషీ.

సిరియాపై దాడిని ఆక్షేపించుచు విషీయందలి ఫ్రెంచి ప్రభుత్వమువారు, స్పెయినునందలి బ్రిటిషు రాయబారి ద్వారా తీవ్రమగు ఆక్షేపణ పత్రముల నందచేసిరి. ఫ్రెంచి ఆక్షేపణనుగురించి అమెరికా సంయుక్త రాష్ట్రముల ప్రభుత్వ కార్యదర్శియగు కార్డెలుహల్లుగారు ప్రకటన గావించుచు, ఫ్రెంచి ప్రభుత్వ వైఖరి చాలా ఆశాభంగకరముగ నున్నదని ఖండించి, సిరియాను మిత్రమండలి ఆక్రమించుట న్యాయమును ఆవశ్యకమును అనియు ప్రకటించెను.

సంయుక్త రాష్ట్రములందలి ఫ్రెంచి రాయబారవర్గమునకు ఆర్థిక కార్యదర్శిగనున్న ఆట్వాంపుగారు, విషీ ప్రభుత్వ విధానము ఇష్టములేక, తన పదవికి రాజీనామా నొసగెను.

సిరియాలో పోరాటమును మాని, మిత్రమండలికి ఆ ప్రాంతముల వశపరుపవలసినదని బ్రిటిషు ప్రభుత్వము పంపిన జాబునందలి కోరకను విషీ ప్రభుత్వము నిరాకరించెను.

## అమెరికా-అట్లాంటిక్ సముద్ర ప్రాంతము.

కార్మిక వివాదములవలనగాని, ఇతర కారణములచేగాని, దేశరక్షణ సాధనముల నిర్మించు ఫ్యాక్టరీలలో పని నిలచిపోవునటుల గన్పించినపుడు సదరు ఫ్యాక్టరీలను స్వాధీనపరచుకొని నిర్వహించుటకు అధ్యక్షునికి అధికారమొసగు చట్టమును అమెరికా సంయుక్త రాష్ట్రముల సెనెటు సభవారు 12 వ తేదిన ఆమోదించిరి. ఆయుధ నిర్మాణమునకు అడ్డుదగులుటకు, కమ్యూనిస్టులు కార్మికసమ్మెల నుపయోగించుకొనునెడల అట్టి ప్రయత్నముల భగ్నమొనర్చుటకు తగు చర్యలు గైకొనబడునని కర్నలు నాక్సు (నౌకాశాఖ కార్యదర్శి) ప్రకటించెను. అమెరికను విమాన నిర్మాణశాలలలో, ఇదివరకు అనుకొనిన దానికంటె నూటికి 50 వంతు లెక్కువ ఉత్పత్తియగుచున్నదని, దేశరక్షణశాఖ ప్రధానాధికారియగు నుడ్సెన్‌గారు ప్రకటించిరి. అమెరికాలో అల్యూమినియం తయారుచేయు పెద్దకంపెనీయగు క్లీవలెండు ఓహియో కంపెనీవారి కర్మాగారములలో సమ్మె 14 వ తేదిన ముగిసెను. దేశరక్షణకొరకు రహదారుల నిర్మించుటకుగాను 25 కోట్ల డాలరులను వెచ్చించుటకు సెనెటువారు 16 వ తేదిన అంగీకరించిరి. ఆఫ్రికాయందలి బ్రిటిషు పటాలములకు ఆయుధసామగ్రిని విమానములమీద పంపు విషయమై రూజ్వెల్టు అధ్యక్షుడు 17 వ తేదిన సైనికాధికారులతో సంప్రదించెను.

"రాబిన్ మూర్" అను అమెరికను నౌక జర్మను జలాంతర్గామిచేతనే ముంచివేయబడినట్లు ధృవపడెనని దేశీయాంగశాఖ సహాయ కార్యదర్శియగు సమ్నరువెల్సుగారు 12 వ తేదిన ప్రకటించిరి. 13 వ తేదిన అమెరికను పత్రికలు జర్మను దౌర్జన్యమును తీవ్రముగ ఖండించుచు, అవసరమగుచో యుద్ధమునకు దిగుటకుగూడ వెనుకాడరాదని

తమ ప్రభుత్వమును హెచ్చరించెను. సంయుక్త రాష్ట్రములలోని అక్సిసు దేశములకున్న సొమ్మును ఆస్తిని "బంధు" చేయుటకు రూజ్వెల్టు అధ్యక్షుడు 14 వ తేదిన ఉత్తరువుగావించెను. ఇటలీయును, జర్మనీయునుగూడ దీనికి ప్రతీకారముగ ఆదేశములలోని సంయుక్త రాష్ట్రీయుల సొమ్ములను ఆస్తులను లాగుకొనుటకుగాను, పూర్తి వివరముల కొరకు అన్వేషణల జరుపుటకు ఉత్తరువుగావించెను. సంయుక్త రాష్ట్రములలోని జర్మను "కాన్సలేటు" కార్యాలయముల నన్నిటిని మూసివేయవలసినదని రూజ్వెల్టు అధ్యక్షుడు 16 వ తేదిన ఉత్తరువుగావించెను. జర్మను కాన్సలుల నీ విధముగ వెడలికొట్టినందుకు జర్మను ప్రభుత్వము 18 వ తేదిన తీవ్రమగు అసమ్మతిని దెలిపెను.

బ్రిటనుకు సరకుల నంపుటకు వినియోగించుటకుగాను సంయుక్త రాష్ట్రపు ప్రభుత్వమువారు కొన్ని నౌకలను పనామా రాష్ట్రపు కంపెనీకి మార్చిరి. ఇందువలన, తాటస్థ్య శాసనమును ఉల్లంఘింపకుండ, బ్రిటనుకు సరకుల నౌకల నంపుటకు వీలగును. మే నెలలో 80 వేల టన్నుల పరిమాణంగల 10 వర్తక నౌకలు అమెరికాలో నిర్మింపబడెను.

18 వ తేదిన సంయుక్త రాష్ట్రపు ప్రభుత్వమువారు, జర్మను లెవ్వరును సంయుక్త రాష్ట్రమును విడచిపోరాదని యుత్తరువుగావించిరి. నౌకా దళములకు సంబంధించిన రిజర్వు సైనికులందరును వెంటనే పటాలముల చేరుటకు సిద్ధముగ నుండవలెననిగూడ సంయుక్త రాష్ట్రపు అధికారులు ఉత్తరువుగావించిరి.

ఫ్రెంచి ప్రభుత్వము, సిరియాలో మిత్రమండలి దాడిని ప్రతిఘటించుటలో, జర్మనుల తరఫున పోరాడుచున్నదని—కార్డెలు హల్లుగారు విషీప్రభుత్వ చర్యను ఖండించిరి.

న్యూ యార్కు రేవులోనికి శత్రు జలాంతర్గాములుగాని నౌకలుగాని ప్రవేశింపకుండజేయుటకుగాను, రేవు పరిసరము లన్నిటియందును మందు గనులను మాటుపెట్టుటకు అధికారులు 14 వ తేదిన ఉత్తరువుగావించిరి.

## నౌకా నష్టములు.

మే నెలయందలి నౌకా నష్టములగురించి ఇంకను సమగ్రమగు లెఖ్ఖలు దెలియకపోవుటచే మాసాంత్యపు నౌకా నష్టముల లెఖ్ఖ ప్రకటన, వాయిదా వేయబడెను. లిబియా ప్రాంతమున పనిచేయుచుండగ శత్రు చర్యలవలన 'టెర్రర్' 'లేడీ బర్డు' అను బ్రిటిషు యుద్ధ నౌకలు మునిగిపోయెను.

13 వ తేదిన నార్వే ప్రాంతమున బ్రిటిషు విమానములు వేసిన బాంబులవలన, 'ల్యూట్జౌ' అను జర్మను నౌకకు దెబ్బలు తగిలెను. ఈ నౌక కుంటుకొనుచు 'బ్రెస్టు' రేవును చేరెను. ఇంగ్లండునుండి ఐర్లండునకు పోవుచున్న టపా స్టీమరు 15 వ తేదిన శత్రు విమానములవేసిన బాంబులు తగలి మునిగిపోయెను.

## టర్కీ, ఇరాక్, ఇరాన్.

అక్సిసు రాజ్యములనుండి టర్కీకి యేవిధమగు భయము నుండదని, జర్మనీ, టర్కీ ప్రభుత్వమునకు 13 వ తేదిన సందేశమంపెను. టర్కీ ఈ వాగ్దానమును భయానుమానములతో వీక్షించుచున్నది.

18 వ తేదిన టర్కీ, జర్మనీలు నిరాక్రమణ మైత్రి యొడంబడికను గావించుకొన్నవి.



టర్కీ వాణిజ్య శాఖయందు పెద్ద యధికారియగు టొరక్ బోరేగారు భారత దేశముతో వాణిజ్యమును అభివృద్ధి పరచుకొనుటకుగాను చాలమంది సలహాదార్లను వెంటబెట్టుకొని భారత దేశమునకు ప్రయాణమగుచుండెను.

టర్కీయందలి బ్రిటిషు రాయబారి 17, 18 వ తేదీలలో విదేశాంగమంత్రితో చాలసేపు సంభాషించిరి.

టర్కీలోని రష్యా రాయబారి తన ప్రభుత్వముతో సంప్రదింపులకొరకు 12 వ తేదిన టర్కీనుండి బయలుదేరి వెళ్లెను.

ఇరాక్ దేశముయొక్క స్వాతంత్ర్యమును మన్నించెదమని, బ్రిటిషు ప్రభుత్వ విదేశాంగమంత్రియగు ఈడెనుగారు సందేశమంపినట్లుల బాగ్దాదు రేడియో ప్రకటించెను. ఇరాకులో తిరుగబాటు ప్రారంభమైనప్పటినుండి నిలచిపోయిన బాస్రా-బాగ్దాదు రెళ్ల రాకపోకలు 13 వ తేదినుండి యథాపూర్వముగ సాగుచుండెను.

## తటస్థ దేశములు (రష్యా, స్పెయిను వగైరా).

రష్యాలో బ్రిటిషు రాయబారిగనున్న సర్ స్టాఫర్డు క్రిప్సుగారు, 12 వ తేదిన బ్రిటనుకు "సంప్రదింపుల" కొరకు తిరిగి వచ్చిరి. జర్మనీకి రష్యాకు సంబంధములు విషమించెననియు, సోవియటులు జర్మనీతో యుద్ధమునకు సన్నాహము లొనర్చుచున్నారనియు వ్యాపింపజేయబడుచున్న వదంతులన్నియు పూర్తిగ అబద్ధములనియు, ఇదివరకు ఉభయదేశములును గావించుకొనిన వర్తక యొడంబడికలు సవ్యముగనే సాగుచున్నవనియు రష్యా అధికారులు గావించిన ప్రకటనను మాస్కో రేడియో 13 వ తేదిన ప్రకటించెను.

పోర్చుగలు ప్రభుత్వము, అజోర్సు దీవుల రక్షణార్థము మరికొంత సైన్యమును పంపెను. అజోర్సు దీవుల నాక్రమించుటనుగురించి, అమెరికా అధికారులు గావించిన ప్రకటనను ఆక్షేపించుచు పోర్చుగలు ప్రభుత్వము అమెరికా ప్రభుత్వమునకు ఆక్షేపణను అందజేసెను.

## దూరప్రాచ్యము.

జపాను-రష్యా ప్రభుత్వములు 12 వ తేదిన మాస్కోలో రెండువర్తక ఒడంబడికలను గావించుకొనెను.

డచ్చి తూర్పు ఇండియా దీవులతో జపాను అధికారులు సాగించుచున్న వర్తక రాయభారములు విఫలమగుటచే—ఇక మీది కర్తవ్యమును గురించి, జపాను మంత్రి వర్గమువారు 12 వ తేదిన సమావేశమై నిర్ణయించుకొనిరి విదేశాంగ మంత్రి, జపాను చక్రవర్తిని దర్శించి ఆ నిర్ణయమును విన్నవించెను. చైనా దక్షిణ సముద్రమున 100 జపానుయుద్ధ నౌకలు కేంద్రీకరింపబడియున్నవనియు, వానిలో కొన్ని దక్షిణముగ ప్రయాణమొనర్చుచున్నవనియు, 15 వ తేదిన చుంకింగునుండి వార్తలువచ్చెను. డచ్చి అధికారుల బెదరించుటకుగా నీనౌకాబలప్రదర్శనము జరుపబడుచుండెనని అనుకొనుచున్నారు. 16 వ తేదిన జరిగిన మరియొక దాడిలో, చుంకింగునందలి బ్రిటిషు, యునైటెడు స్టేట్సు రాయబార కార్యాలయములకు గూడ బాంబు దెబ్బలు తగిలెను. జపానునందలి బ్రిటిషు రాయబారియగు సర్ రాబర్టు క్రెయిగీగారు, ఈ చర్యకు ఆక్షేపించుచు, జపాను విదేశాంగ కార్యాలయమువారికి తమ అసమ్మతిని దెలిపెను. వాణిజ్య ఆర్థిక సంప్రదింపులు విఫలమగుటచే తిరిగి రావలసినదని—జపాను ప్రభుత్వము, తూర్పు ఇండియా దీవులయందలి తమ రాయబారవర్గమునకు ఉత్తరువుల నంపిరి. ఆ యుత్తరు

ళుల ప్రకారము తిరిగి పోవుటకు పూర్వము, జపాను రాయబారి వర్గ్నాయుడుగారును, డచ్చి అధికారులను కలిసి తమ ప్రయత్నములు విఫలమైనందుకు విచారము తెలిపి దీనివలన ఉభయదేశములకును గల సాధారణ రాజకీయ సంబంధము లంతు మార్పుండదని ప్రకటించిరి.

తూర్పు ఇండియా దీవులలో డచ్చి అధికారులు 400 టార్పెడో బోటులను నిర్మించుటకు ఏర్పాటు లొనర్చుకొనిరి. 16 వ తేదిన, బటేవియాలో డచ్చి గవర్నరు జనరలు శాసనసభలో ప్రసంగించుచూ డచ్చి ముడిపదార్థములను శత్రురాజ్యములకు అందజేయుటకు తామెంత మాత్రమును అంగీకరింపమని ప్రకటించిరి.

వెండెలు విల్కీగారు న్యూయార్కు నందుపన్యసించుచునైనాకు, వెంటనే సంపూర్ణమగు యుద్ధసామగ్రి సహాయ మొనర్పనియెడల, దూర ప్రాచ్యమున అమెరికాస్థితి క్లిష్టమగునని ప్రకటించిరి. మంగోలియానుండి చైనా సైన్యములు, దక్షిణమునకువచ్చి, యెల్లో నది మీదనున్న జపానుదుర్గమగు "పాకౌటూన్"ను ముట్టడించుచున్నవి. 14 వ తేదిన జపాను విమానములు, చైనా రాజధానియగు చుంకింగుపై తీవ్రమగు విమానదాడి జరిపెను.

సయామునకును బ్రిటనుకును ఎట్టి విభేదములును లేవనియు, సయాము సరిహద్దులలో బ్రిటిషు సైనిక కేంద్రీకరణమునకు కారణములు తమకు తెలియుననియు అది సయాముపై దాడి జరుపుట కుద్దేశింపబడినదిగాదనియు, సయాముపై దాడి జరుగ నుద్దేశించుచున్నటుల వ్యాపింపచేయబడుచున్న వదంతులు గిట్టనివారు చేయు ప్రచారముగాని నిజముగాదనియు, సయాము రాజకీయ నాయకులు ఖండించుచు సయాము తటస్థముగనే యుండునుగాని యుద్ధములో పాల్గొనదని ప్రకటించిరి.

## ఇటలీ-గ్రీసు.

ఇటలీ విదేశాంగ మంత్రియగు కియానోగారును, జర్మను విదేశాంగ మంత్రియగు రిబ్బెన్ట్రాపుగారును వెనిస్ నగరమునందు 14 వ తేదిన సమావేశమైరి. ఆ సమయమున, ప్రాత యుగోస్లావియాలో క్రొత్తగా స్వతంత్ర రాష్ట్రముగ నేర్పరుపబడిన క్రోషియా రాష్ట్ర ప్రతినిధులు మూడు రాజ్యాల యొడంబడికలో సంతక మొనర్చి, అక్సిసు నాయకత్వము నంగీకరించి సహకార మొనర్చుటకు ఒడంబడిక యొనర్చుకొనిరి.

ఇంతవరకు 244 వేల ఇటాలియను సైనికులు బ్రిటిషు వారికి ఖైదీలుగా చిక్కిరి.

## ఆక్రమిత ప్రాంతములు.

బెల్జియము రాజగు లియోపాల్డుగారు బెల్జియములో రాజకీయ ఖైదీగనే యుండవలెనని పరిగణించుకొనుచున్నారు. వారు తమతో సంధి చేసుకొనవలసినదని జర్మనులు యెంతవత్తిడి చేయుచున్నను లొంగుట లేదు.

---

బ్రిటిషు బాంబరు విమానములు జర్మనీ యుద్ధ పరికర నిర్మాణశాలలు మొదలగు వాటిని ధ్వంసము చేయుచున్నవి.



ప్రతిరోజు రాత్రిపూట బ్రిటిషు విమానములు జర్మనీలోకి వెళ్లి ఆయుధ నిర్మాణశాలలను ఇతర మిలిటరీ కేంద్రములను ధ్వంసము చేస్తవి. ఈ పటములో చాలదూరము పొగల ఒక బ్రహ్మాండమైన బ్రిటిషు బాంబరు విమానములోనికి బాంబులను ఎక్కిస్తున్నారు.

# మిత్ర మండలి సభలో చర్చిలు గంభీరోపన్యాసము.

## ఆంగ్ల ద్వీపము అభేద్యము.

### విజయం చేకూరేవరకు పోరాటం సాగుతుంది.

లండనులో సెంటు జేమ్సు కోటయందు మిత్రమండలి దేశాల ప్రతినిధులును, బ్రిటిషు సామ్రాజ్య దేశాల ప్రతినిధులును, బ్రిటిషు ప్రభుత్వ ప్రతినిధులును 12 వ తేది సభచేసి విజయం చేకూరేవరకు యుద్ధం కొనసాగించుటకు దృఢ సంకల్పం ప్రకటించుచు, స్వతంత్ర దేశాలపై జర్మనీ దౌర్జన్యం కొనసాగుతున్నంతకాలం రాజీకుదురనేరదని తెల్పుచు తీర్మానం చేసిరి. ఈ సభకు జార్జి రాజుగారుగూడ హాజరయ్యిరి. చర్చిలు ప్రధాని వేరొక గంభీరోపన్యాసము నొసంగెను. హిట్లరు జయించిన రాజ్యములలో నాజీలు చేయుచున్న దారుణకృత్యములను వర్ణించి చెప్పిన పిమ్మట చర్చిలుగారు యిట్లనిరి :—

"ఐరోపాఖండ రాజ్యములకు విమోచన యెప్పుడు యెట్లు రానున్నదో చెప్పజాలం. కాని, అట్టి విమోచన వచ్చినప్పుడు హిట్లరుయొక్క అడుగుజాడలు యెక్కడా లేకుండా తుడిచివేస్తాం. అతని పాపపంకిల చిహ్నములు కడిగివేస్తాం. ఈ భూమిమీద అతని నామరూపాలు లేకుండా చేసేస్తాం. హిట్లరు ఐరోపా ఖండమంతటను స్వేచ్ఛా విహారంచేసి ప్రజలను హింసించి పీడించుగాక : అతడు ఆఫ్రికాలోగాని ఆశియా ఖండంలోగాని విజృంభించుగాక — కాని, అభేద్యమగు ఆంగ్ల ద్వీపములో అతని అంతు తేలగలదు. నేలమీదను నీటిమీదను వెనుదీయక పోరాడుతాం. అతడెక్కడకు వెళ్లితే అక్కడికి వెంటాడి వేటాడుతాం. ఈ యుద్ధం యీ రీతిగా యెంతకాలం జరుగునో చెప్పజాలం. ఏ రీతిగా ముందు పరిణమించునో చెప్పజాలం. ఇంకను యెన్ని రాజ్యాలకు విస్తరించునో చెప్పజాలం. మొత్తంమీద దారుణంగానే వుంటుంది. కాని ఒక్క విషయంమాత్రం నిశ్చయం. అది నిర్వివాదాంశం, అభేద్యమగు సిద్ధాంతం. ఐరోపాఖండ పునర్నిర్మాణంగాని పునర్విభజనగాని జర్మనులమూలంగా జరుగదు."

హిట్లరిజంను యెదుర్కొనే తమ శక్తి యెట్లు వృద్ధియగుచున్నదో తెల్పుచు చర్చిలుగారిట్లనిరి :—"పోయిన సంవత్సరం జూను మాసంలో సంభవించిన దురవస్థ దాటిపోయినది. నాటికి నేటికి మనమెంత ముందుకు సాగితిమో చూడవలసియున్నది. మాయొక్క అఖండమయిన మొండి పట్టుదల అగ్నిపరీక్షలకు నిలువకల్గినది. నేడు ఆకాశ వీధిలో మా విమానబలం అజేయంగా వుంది. శత్రువులపై దినదిన ప్రవర్ధమానంగా ప్రతీకారంచేస్తున్నాం. బ్రిటిషు నౌకాదళం సముద్రాల నేలుచున్నది. రేవులలో దాగియున్న ఇటాలియను నావలు క్షీణించినవి. జర్మను నౌకాదళం యిదివరకే నిస్సత్తువ చెందింది. చాలవరకు నీటముంచి వేయబడింది. బ్రిటిషు రేవులపైనను పరిశ్రామిక నగరాలమీదను శత్రువిమానాలు బాంబులు వేయుచున్నను బ్రిటిషు ప్రజల ధైర్య స్థైర్యములను చలింపజేయజాలకున్నవి. బ్రిటిషువారి నిత్యకృత్యములను యుద్ధ పరిశ్రమలను నిరోధింపజాలకున్నవి. అమెరికానుండి ఆహారపదార్థములు ఆయుధములు సముద్రాలుదాటి భద్రంగా వస్తున్నాయి. మునిగినన్ని స్టీమరులు మళ్లీ యిక్కడ తయారవుతున్నాయి. అమెరికా నుండి వస్తున్నాయి. నష్టం భర్తీచేయబడుచున్నది. మా నేల సైన్యములకు సామగ్రి శిక్షణ పూర్తిగ చేకూరుచున్నది.

"యుద్ధం అంటే ధ్వజమెత్తి లూటీచేయడం మాత్రమే కాదని మా విమానదళం జర్మనీకి గుణపాఠం నేర్పగలదు. ఓడిన రాజ్యాలలోని ప్రజలందరిని పురిగొల్పి తిరుగుబాటు చేయిస్తాం. జయించిన రాజ్యాలన్నింటిని అణచియుంచాలని హిట్లరు చేయు యత్నాలన్నింటిని భేదిస్తాం. అతడికిక శాంతియుండదు, నిద్రయుండదు, విశ్రాంతియుండదు. మాటలతో మాకు పనిలేదు. అతడు చిట్టచివరకు దుష్టవిషమావస్థలో పడి ఇంగ్లాండుమీదికే దండెత్తి వచ్చినను—అదికూడా అసంభవం కాదు—వచ్చుగాక. అట్టి ఆఖరు విషమపరీక్షలో కూడ వెనుదీయక చెక్కు చెదరక ధైర్యంతో పోరాడుతాం.

"భగవంతుని సహాయం మనకున్నది. అది అనుదినం మనకు విశదమవుతునే ఉన్నది. ఆ భగవత్కటాక్షబలంతో మన కార్యం నెరవేరేవరకు పోరుసాగించి తీరుతాం. ఈ శుభవార్తనే నేడు మనం ఓడినరాజ్యాలకును, స్వతంత్రరాజ్యాలకును, స్వాతంత్ర్యం కోరే సమస్త ప్రపంచవాసులకును, యూరోపులోని మన మిత్రులకును, సముద్రాలను దాటి మనకు సమర్థతతో సంతత సహాయం చేస్తున్న అమెరికా మిత్రులకును యీ సందేశమునే అందజేయుదుముగాక. అదేదన ; గుండెనిబ్బరంతో నిలువంతి, సమస్తం సక్రమముగా సాగుతుంది. ఈ విషాద సాగరంనుంతి, యీ త్యాగసముద్రంనుంతి అఖిల మానవశుభారుణోదయం కాగలదు."

## తీర్మానం.

సభలో యీ దిగువ తీర్మానం అంగీకరించబడెను :—

ఇంగ్లాండు, అయిర్లాండు, కెనడా, బెల్జియం, జెకోస్లొవేకియా, గ్రీసు, లగ్జెంబర్గు, హాలెండు, నార్వే, పోలండు, యుగోస్లావియా ప్రభుత్వములున్ను, స్వతంత్ర ఫ్రెంచి పక్షనాయకుడైన డీగాల్ సేనాని ప్రతినిధులున్ను కలసి యీ క్రింది రీతిని తీర్మానించుకొనిరి :—మొదటి విషయం ఏమనగా, విజయం లభించేవరకున్నూ, జర్మనీ-ఇటలీలను ఎదిరించి పోరాడడానికి ఈ దేశాల ప్రభుత్వములు నిశ్చయించుకొని పరస్పరము తోడ్పడుటకు నిర్ణయించుకున్నవి.

(2) జర్మనీయున్ను జర్మనీయొక్క అనుచర రాజ్యాలున్నూ కలసి స్వతంత్రమైన రాజ్యాలలోని ప్రజలను నిర్బంధించి పీడించుచున్నంతకాలం శాంతియుండనేరదు. సుభిక్షంగా ఆ దేశాలు వర్ధిల్లజాలవు, కావున,

(3) స్థిరమైన శాంతియు, అన్నిరాజ్యాలవారికి అన్యోన్య సహకారమున్ను పెంపొందవలెనంటే, అన్నిరాజ్యాలవల్ల ఆక్రమ దౌర్జన్యభయం తొలగిపోవాలి. అన్ని దేశాలవారికిన్ని ఆర్థికంగాను, సాంఘికంగాను భద్రత అనేది ఉండాలి. అట్టివి నెలకొల్పడానికే యీ రాజ్యాలవారు, యీ యుద్ధ సమయంలోను, శాంతియేర్పడిన పిమ్మట కూడా కృషిచేయవలెనని ఉద్దేశించియున్నారు."

ఈ సభకు ఇండియా తరఫున ఇండియా మంత్రి ఎల్. ఎస్. అమెరీగారు హాజరయినారు.

# లిబియాలో బ్రిటిషువారి చొరవ

## కాపుజో వశము కానుంది.

## నేల సైన్యాలకు విమానాల తోడు.

లిబియాలో బ్రిటిషు సైన్యాలు యీ వారం సోలం ప్రాంతములందు ముందుకు దాడి ప్రారంభించినవి. ఈసారి యుద్ధం నిశ్చయంగా హైఫాపాసునకు పడమరనే జరిగింది. బ్రిటిషు సేనలో భారతీయ సేనకూడాగలదు. వారు కాపుజో వరకు సాగిపోయిరి. ఈ కాపుజోనుండియే జర్మనులు అనేక సార్లు నిష్ప్రయోజనంగా ఎదురు దాడులు ప్రారంభించిరి. జర్మనులు ఇటలీవారు యింకా సోలంలో నున్నారు. కాని వారికి మార్గనిరోధం కల్గును. "రెండు పక్షాలవారు టాంకులు అగాధ మోటారులను విరివిగా వదలుచున్నారు. ఉభయులకు విమానదళాల సహాయం బాగా యున్నట్లుంది." అని కొలంబియా రేడియోకు కైరో నగర విలేఖరి తెలిపెను. అంటే మధ్యప్రాచ్యదేశమునందు రాయలు విమానదళమును ఎక్కువచేసి, నేల సైన్యాలన్నింటికి తోడుగా నివ్వెదమని గతవారం చర్చిలు ప్రధాని పార్లమెంటులో చెప్పిన ప్రకారం జరుగుచున్నదన్నమాట. బ్రిటిషు సేనాధికారి జనరలు వావెలు తనకార్యాగ సిద్ధించి, ముందు చర్య నిశ్చయించుకొనువరకు విజయం ప్రకటించే అలవాటుకలవాడు కాడు. అయినా అమెరికా పత్రికలున్ను రేడియోయున్ను, యీ దాడిలో ఏదో పెద్ద ఎత్తున్నదని చెప్పుచు, మొట్టమొదట ఆతడు జరిపిన లిబియా యుద్ధంతో సరిపోల్చి చూచుచున్నారు. బార్డియా ఇంకా శత్రువుల చేతులోనే ఉంది. అయినా బార్డియాకు పడమరను పనిచేయుచున్న ఇటలీ మోటారుదళమును బ్రిటిషు సైనికదళము పిప్పిపిప్పి చేసివైచెను. దీనిబట్టి ఎడారియుద్ధం ఎంత అస్థిరసంఘటనమో రుజువుకాగలదు.

పట్టి ప్రకల్పాలు మినహా అబిసీనియాలో అంతా ముగిసింది. జిమ్మా ప్రాంతములందు ఇటలీ సైన్యాలను బ్రిటిషు సామ్రాజ్య సేనలు చుట్టివేసి, ఎందరో ఉద్యోగులను సైనికులను ఖైదీలుగ పట్టుకొనిరి. ఇరిట్రియాలో రెండవ రేవుస్థలమగు అసబు బ్రిటిషువారిచే జిక్కెను. ఇంక శత్రువునకు మధ్యధరాసముద్రం వెలుపల స్వంత రేవు లేదు. ఆ మధ్యధరాసముద్రంలో బ్రిటిషు నౌకాదళానికి అడ్డులేదు. ఈ వారం బ్రిటిషు జలాంతర్గాములు పడి ఇటలీ సేనలను ముంచివేసినవి. బెంగాజీపైని లిబియాలో యితర అక్షరాజ్యాల శిబిరాలపైని బ్రిటిషు విమానాలు తరుచు బాంబులువేయుచు జర్మనుసేన పెద్దది చేరకుండ కాపాడుచున్నవి. అమెరికానుండి సరాసరి ఆఫ్రికాలో బ్రిటిషు సేనలకు తమ విమానాలు అందునట్లు అధ్యక్షుడు రూజువెల్టుగారు తగు శ్రద్ధవహించుచున్నందున, జర్మను విమానదళమగు లఫ్టువాఫ్‌కి తగిన దెబ్బ తగులునని ఆశింపవచ్చును.

# సిరియాలో మిత్రమండలి సేన పురోగమనం

## డామస్కసు నగరంపైదాడి.

[విషీ (ఫ్రాంసు) ప్రభుత్వం క్రిందనున్న సిరియాలోనికి జర్మను సేన కొద్దిగా, క్రీటు ఆక్రమణ తదనంతరం ప్రవేసించెను. వెంటనే సిరియా రక్షణకై డిగాలుగారి స్వతంత్ర ఫ్రెంచి సేన బ్రిటిషు సామ్రాజ్య సేనతోగూడ సిరియా ప్రవేశించి, కిస్వేనగరం ఆక్రమించి, డమస్కసు ముఖ్యపట్నముపైకి పోవుచున్నది. జర్మను సేన యింకా దిగలేదు విషీ సేనలే మిత్రమండలి సేనతో పోరాడుచున్నవి.]

మిత్రమండలి సేనలు సిరియాలో క్రమేణ ముందుకు సాగుచున్నవి. దాడి నెమ్మదిగా సాగించుచున్నారు. ఇదివరకు మిత్రులుగానుండి యుద్ధరంగములో తమతో కలసి పోరాడిన మిత్రులతో యిపుడు రక్తపాతమగు యుద్ధంచేయ యిష్టంలేక, విషీ సైన్యాలు లొంగిపోవుటకు అవకాశమిచ్చుటకే దాడి నెమ్మదిగా సాగిస్తున్నారు. "కాని సిరియాలో విషీ ఫ్రెంచివారు మాత్రం క్విస్లింగు (ద్రోహపు) ప్రభుత్వం ఉత్తరువు ప్రకారం తీవ్రనిరోధం గావించుచున్నారు" అని న్యూసు క్రానికలు పత్రిక వ్రాయుచున్నది. ఆ నిరోధం అణచి వేయడానికి మన శక్తినంతా వినియోగించాలంటున్నది. అన్ని విషయాలాలోచిస్తే, ఫ్రెంచివారు హ్రస్వదృష్టి ననుసరించినందుకు యీ మాత్రం నష్టపోవుట లెక్కచేయవలసిందికాదు. "సిరియాను మనం వెంటనే తీసుకోకపోతే స్వతంత్ర ఫ్రెంచిదేశం గతి ఏమగును. దాని విజయం వెనుకబడును. మనం గెలిస్తే, విషీ అనుకూలురు కొద్దిమంది చనిపోయినా, ఫ్రాంసు భావి భాగ్యముకొరకు ఆ మాత్రం త్యాగం లెక్కలోనిది కాదు.

సిరియా ముఖ్యపట్నమగు డామస్కసుపైని మిత్రమండలి సేనలుపడనున్నవి. హైసన్న కొండలవైపునుండి వచ్చి నగరాన్ని చేరుకొనుచున్నారు. మిత్రమండలి వశమందున్న మెఝజ్ అయోంనగరంపైబడి మనవారి దృష్టి మరల్చాలని విషీ సేనలు యత్నించినవి. కాని వారియత్నం పడగొట్టుటకు అధిక సైన్యం అక్కడకు వెంటనే పంపబడెను. ఈలోగా సముద్రతీరాన మిత్రమండలివారు సిడాను అను ప్రాచీన రేవుపట్నం వశపరచుకొని, బైరూతు చేరుకొనుచున్నారు. సామ్రాజ్య సేనలకు బ్రిటిషు నౌకాదళం బాగా సహాయం చేస్తున్నది. జర్మను విమానదళం ఆ సహాయం అందకుండ అడ్డుతగులుచున్నను, రాయలు ఫైటరు విమానాలు సిరియా ఆకాశమంతా ఆక్రమించి, వాటిని తరిమివేయుచున్నవి. ఒక విషీ యుద్ధనౌక ముంచబడింది. కాని టోలోనులో బయలుదేరిందన్న విషీ నౌకాదళం యింకా ఎక్కడా అగుపడుటలేదు. ఉత్తరాన ఇరాకునుండి మిత్రమండలి సేనలు రానున్నవి. అవివచ్చిచేరినచో డామస్కసు నగరానికి ఉత్తర సిరియాకు సంబంధం తెగును. అపుడు లొంగిపోక తప్పదు.

స్వతంత్ర ఫ్రెంచిసేనలు సిరియాలో మంచి ప్రతిభ చూపుచున్నవి. అవి కిస్వేనుండి విషీ ఫ్రెంచి సేనలను తరిమివేసినవి. వారి నాయకుడు అదివరకు బాంబులచే గాయపడిన జనరలు లిజెంటిలు హొమముగారు, తిరిగి యుద్ధరంగం చేరుకొన్నారు. వారు డమస్కసు నాక్రమించుటలో ప్రధానపాత్ర వహింపగలరు.

# సింగపూరు ప్రాచ్యదేశాలకు సింహద్వారం.

## సామ్రాజ్యంయొక్క రక్షణ శిబిరం.

సింగపూరు అంటే సింహాలపురమన్న మాట. అది యిపుడు బ్రిటిషువారి వలసరాజ్యమగు స్ట్రెయిట్సు సెటిల్మెంటులో చేరియున్నది. కాని దీని పేరు సూచించునట్లుగా యిది భారత సామ్రాజ్యములో భాగంగానుండింది. హిందూ నాగరికత చిహ్నములు యిప్పటికి అందుగలవు. నేడది ప్రధాన శ్రేణికి చెందిన అధునిక నాగరిక నగరం. అదో ద్వీపం, అదో నగరం, అదో నౌకాదళ శిబిరం. ఆశియాఖండపు దక్షిణకొననున్న యీ రేవునకు, ఆ భూఖండమునకు మధ్య 1¼ మైలు వెడల్పు కాల్వ గలదు. భూమధ్యరేఖకు 78 మైళ్లు దక్షిణంగానున్నది. 18 మైళ్లు పొడుగు 15 మైళ్ల వెడల్పుగల దీవి యిది.

ఈ ద్వీపానికి దక్షిణ తీరానయున్న యీ నగరమునందు 700,000 జనాభా ఉంది. వారిలో మూడింట రెండువంతులు చీనావారు, 95,000 మంది మలయావారు, 8 000 మంది తెల్లవారున్నారు. మిగిలినవారంతా అన్ని దేశాల కలగాపులం జాతులవారున్ను. వీధి పేర్లు గూడ ఇంగ్లీషు, చీనా, మలయా మూడు భాషల్లో వ్రాయాలి. ఈ రేవు గుండానే ప్రపంచానికి సప్లైయగు రబ్బరు, తగరం సరుకంతా పోతుంది. ఇందులో భారతీయులు కూడా తగినంతమంది ఉన్నారు.

సింగపూరు నౌకాశ్రయం దీవికి ఉత్తరతీరాన మలయాకు ఎదురుగా ఉన్నది. ఇది కట్టుట 1938 లో పూర్తియైనది. 50 చదరపు మైళ్లు సురక్షితమగు నీటిరేవు గలదు. ఇంగ్లాండు, అమెరికా సంయుక్త రాష్ట్రాల రెండింటి నౌకాదళాలను అందు ఉంచవచ్చును ఎంత పెద్ద యుద్ధనౌకనైనా చేర్చుకొని మరమ్మతుచేయగల నీటిరేవు, పొడి రేవులు (డ్రైడాక్సు) కూడా గలవు. సమర్థులగు పనివారు, మరమ్మత్తు యంత్రాలు, క్రేన్సు ఎన్నో గలవు. వాటికవసరమగు రైలు మార్గాలున్నాయి. అంతేకాక నౌకాదళాలకు, విమాన దళాలకు చమురు సప్లైచేయు టాంకులు భూమిపైనా, భూగర్భంలోను అమర్చబడియున్నవి.

వంతెన.—సింగపూరు దీవిని ఆశియా ఖండంతో కలిపే వెడల్పైన వంతెన యొకటిగలదు. అవసరమైతే శత్రువులు దీవిలోనికి రాకుండా చేయడానికి ఒకమీట నొక్కి.. దీనిని తగులపెట్టే సాధనలున్నాయి. నౌకాదళం శిబిరం చుట్టు సముద్రంనీటిలో మందుగనులు వేసియుంచిరి. చుట్టూ విమాన విధ్వంస ఫిరంగులమర్చేరు. తీరపు రక్షణ శిబిరాలు, దూరం ప్రేల్చే బారు ఫిరంగులు తగుచోట్ల అమర్చబడినవి. పగలంతా బ్రిటిషు-ఆస్ట్రేలియా వైమానికులు కాపలా కాస్తూ ఉంటారు. శత్రునౌక ఒక్కటైనా గుండ్రేటు దూరంలోకి కనబడకుండా రాజాలదు. నౌకాదళ శిబిరానికి నగరానికి కలిపే రైలుమార్గము, రెండు కాంక్రీటు రోడ్లు గలవు. నగరం చుట్టుగూడ రక్షణ ఫిరంగులు గలవు.

నౌకాదళ శిబిరం కట్టడానికి 20,000,000 పౌను లయింది. తీరరక్షణ పరికరాల ఖర్చు వేరు. స్ట్రెయిట్సు సెటిల్మెంటు రాబడిలో నూటికి 20 వంతు చొప్పున ఎన్నేండ్లో దీనికై వెచ్చింపబడింది. అత్యుత్తమ సైనిక రక్షణగల శిబిరాలగు మాల్టా, పెనామా, పెరల్ హార్బరు, జిబ్రాల్టరులతో సరిసమానమైనది సింగపూరు బ్రిటిషు సామ్రాజ్యానికి తూర్పున ముఖ్యకేంద్రం. తూర్పు దీవులకు బ్రిటిషు మలయాకు సింహద్వారం. ప్రపంచ సంపదయగు రబ్బరు, తగరం వ్యాపారానికి ముఖ్యమార్గం. సింగపూరు లేకుంటే తూర్పు డచ్చి దీవులను యీపాటికి జపాను తుడిచేసేది. సింగపూరు స్వాధీనంలో లేకుంటే ఆస్ట్రేలియాకు ద్వారం తెరచినట్లే.

“అమెరికావారి ఫిలిప్పయిను దీవులు సింగపూరు శిబిరంపైనే ఆధారపడియున్నవి. అవి లేకుంటే జపాను సముద్రంలో సామాన్య దీవులుగా ఫిలిప్పయినులుండేవి. సింగపూరు ఒక నగరంగా, దీవిగా, నౌకాదళ శిబిరంగానే కాక, ప్రాచ్యదేశాలకు సింహద్వారంగా ప్రాధాన్యత వహించియున్నది. జపాను దక్షిణదాడి అంతా దీని నుద్దేశించే జరుపుచున్నది” అని ఒక అమెరికను గ్రంథకర్త వ్రాసెను.

### నేటి కట్టుదిట్టాలు.

ఈ శిబిరాన్ని రక్షించడానికి ఇంగ్లాండు తగిన కట్టుదిట్టాలు చేసింది. విమాన దళాధికారియగు సర్ రాబర్టు బ్రూకు పాఫేముగారు దూరప్రాచ్య సర్వ సేనాధికారిగ నియమింపబడిరి. మలయా, బర్మా, హాంగుకాంగు యీ మూడింటిలోని నేల విమానదళాలు రెండింటికి ఒకే సేనాధికారి నియమింపబడుట కిదే మొదలు. వీరు కేంద్రస్థానం సింగపూరులో నుంచుకొని, నౌకాదళ ప్రధాన సేనానియగు వైసు అడ్మిరలు సర్ జఫ్రీలేటను (చీనా స్టేషను) గారితో సమాలోచనచేసి పనిచేయుచుందురు. ఈతడు చేరిన కొద్ది వారాలలోనే మలయాకు క్రొత్త సైన్యాలు, విమాన దళాలు వచ్చి చేరినవి. ఇంకను రాగలవు. ఎడతెగకుండా సైన్యాలను సామ్రాజ్య ప్రభుత్వంవారు పంపుతారని పాఫేముగారు ప్రకటించిరి. వీరి యావరణక్రిందనున్న వలసరాజ్యాల గవర్నరులందరితో స్వయంగా సంప్రదించుటకు, అన్ని సేనలకు ఉత్తరువులు చేయుటకును వీరికి అధికారంగలదు. ఆస్ట్రేలియా, న్యూజిలండు ఇండియా సేనాధిపతులతో సంప్రదించ

వచ్చెను. ఇటీవల ఈతడు బర్మానుచూచి వచ్చెను. హాంగు కాంగునుండి రంగూనువరకు దూరప్రాచ్య దేశాల రక్షణ యేర్పాటులు సరిచూచెను.

### ఇండియానుండి సేనలు.

సింగపూరు రక్షణకై పోవు సైన్యాల సంఖ్య వృద్ధియగుచున్నది. ఇండియానుండి వస్తున్న సైన్యాలు చాల శక్తివంతమయినవి. భారతీయ సైన్యాలు తమతో తమ మోటారులనుకూడ తెచ్చుకొన్నవి. వీరు పూర్తిగ యంత్ర సామగ్రి కలిగియున్నారు. సామాను మోయుటకైనా కంచరి గాడిదలక్కరలేదు. రేవులో దిగి అతి త్వరగా మలయాలో ఉన్న వివిధ కేంద్రాలకు యింత పెద్ద సైన్యం చేరగల్గుట ఆశ్చర్యంగా ఉంది. చూచిన పెద్ద ఉద్యోగులంతా నివ్వెరపోయిరి. వాళ్లు చేరినవెంటనే అడవులలో యుద్ధ విన్యాసం ప్రారంభించిరి. భారతీయ సైన్య కేంద్రాలను సర్ బ్రూకు పాఫేముగారు స్వయంగా చూచిరి. వారు పోయినపుడు తూర్పు తీరాన ఒక శిబిరంలో తొలి రోజునే 7 పదున్ల వర్షంపడెను. అయినా సైనికులు ఉత్సాహం చెడక అతి వడిగా తయారయి వారికి స్వాగత మిచ్చిరి. మలయా పరిస్థితులకు త్వరగా అలవాటుపడిరి. అని సిలను పత్రిక సింగపూరు విలేఖరి వ్రాసెను. "వారు తమ బాధ్యతను విధిని చక్కగ నిర్వహింపగలరని నమ్ముచున్నాను" అని సేనాధిపతియనెను.

ఆస్ట్రేలియా, న్యూజిలండులనుండి విమాన దళాలు యిటీవలనే సింగపూరువచ్చినవి. దూరప్రాచ్య రక్షణ బురుజగు సింగపూరు రక్షణ బాధ్యత యీ రెండు దేశాలకుగూడ గలదని రుజువయ్యెను. "దూరప్రాచ్యమునందలి బ్రిటను స్వరము" అను పేరన సింగపూరు రేడియో స్టేషను ప్రచారము జపానునుండి న్యూజిలండువరకు వినబడును. బ్రిటిషు సామ్రాజ్యమునందలి తూర్పు శ్రేణి ఐకమత్యమును పెంపొందించుటకును, రక్షణ దిట్టపరచుటకు యీ రేడియోకూడ మిగుల తోడ్పడగలదు.

---

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.